## విద్య

మొగలు పరిపాలనా కాలమున విద్యాశాఖ మత శాఖయొక్క అంగముగ నుండెను. దీని వ్యయము "దానములనిధి" నుండి యొసంగబడు చుండెను. ఔరంగజేబు విద్యావ్యాపకమునకు పర్గానుల ద్వారా సుబేదారులకు ఉపాధ్యాయుల నియమించుటకును, విద్యార్థి వేతనములు నొసంగుటకును శాసించి యున్నాడు. ఈ వ్యయము కోశాగారము నుండి యివ్వబడు చుండెను. గ్రాంటు తక్కువయుండుటచే ముస్తుము మాఫీకే నియమింప బడి యుండిరి. కనుకను విద్యార్థి వేతనములు పొందుచుండిరి.

## వ్యక్తుల ఆస్తి

మొగలు పరిపాలనమున సామంతరాజులును, జమీందారులకును, దప్ప ఇతరులలో ఒకడు చనిపోయిన ఆతని వారసుడు ఆ ఆస్తిని పొందుటకు హక్కు లేకుండెను. చక్రవర్తి ఆ ఆస్తిని తన స్వాధీనము చేసికొని తన యిష్టానుసారము వారిసులకు విభాగించుచుండెను. జ్యేష్ఠ కుమారుడు సామాన్యముగ తండ్రిగారి పను పొందుచుండెను. ఇది అనాగరిక విధానమని బర్నియరు సూచించి యున్నాడు. భూమి యజమాని చక్రవర్తి యగుటచే వేతనములకూర్చి యిచ్చిన జాగీరులు చక్రవర్తి సమ్మతి యున్నప్పుడొసంగి, లేని వరకు తీసుకొనువాడు. సర్దారుల ప్రతులు తండ్రిగతించిన పిదప ఆస్తి యంతయు ప్రభుత్వము స్వాధీన పరచుకొనుట వలన భిక్ష మెత్తుకొనవలసిన సందర్భములుకూడ కొన్ని సమయములందు కలుగుచుండెను. అధికారులు ఉద్యోగుల ఆస్తి స్వాధీన పరచుకొనుటకు కొన్ని కారణములు గలవు సహజముగ వీరు ప్రభుత్వము కోశమునుండి అప్పులు తీసికొని చెల్లించకుండువారు కొందరు లెక్కలు సరిగ నుంచకుండిరి. ఇందువలన వారు చనిపోగ ఆస్తి ప్రభుత్వము స్వాధీన పరచుకొనుచుండెను చనిపోయిన వానికి వారసులు లేకుండిన చక్రవర్తి ఆ ఆస్తికి యజమానగుచుండెను. ఇస్లాం మతానుసారము పాదుషా సేనానాయకుడు, ఇతడు ఇస్లాము సేనలోని అధికారుల ఆస్తిని స్వాధీనపరచుట కధికారము కలిగియుండెను రాజు ట్రస్టీ. ఈ పద్ధతివలన కొన్ని అనర్థములు కలిగెను. చక్రవర్తి అధికారి మరణానంతరము ఆస్తి స్వాధీనపరచుకొనునని తలచి తన జీవితకాలమునందే వ్యయపరచుచుండెను. ప్రజలు ఉత్పత్తికై పాటుబడుటకు మూలధనము చిక్కకుండెను. కొన్ని సందర్భములయందు ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనుటకు పూర్వమే యొకరో నడిమివారపహరించు వారు ప్రజా స్వాతంత్ర్యమునకు భంగము కలిగెను. సర్దారులు స్వార్థపరులయిరి

వారసులేనివారి ఆస్తినుంచుటకు "బేతుల్ మాలు" అను కార్యాలయము ముండెను. ఇందు రాను రాను ఔరంగజేబు కాలమున ప్రభుత్వము స్వాధీనపరచుకొనిన ఆస్తి నుంచబడుచుండెను ఇస్లాము మతానుసారము ఈ ఆస్తి దైవముది. కనుక దీనిని దానములకు వెచ్చింపవలయును ఔరంగజేబు పరిపాలన మధ్యకాలమున ఈ ద్రవ్యము పకీరుల సహాయమునకు ఖర్చుచేయబడెను.

## ప్రపంచ భాషలలోని

### అక్షరములు (ఓనమాలు)

| | | | |
|---|---|---|---|
| బర్మా | భాషలో | ౧౯ | అక్షరములున్నవి. |
| ఇటలీ | ,, | ౨౦ | ,, |
| బంగాళీ | ,, | ౨౧ | ,, |
| ఈరాని | ,, | ౨౨ | ,, |
| ఫ్రాన్సిసీ | ,, | ౨౩ | ,, |
| యూనాని | ,, | ౨౪ | ,, |
| లాటిన్ | ,, | ౨౫ | ,, |
| ఇంగ్లీషు | ,, | ౨౬ | ,, |
| జర్మని | ,, | ౨౬ | ,, |
| అరబ్బీ | ,, | ౨౮ | ,, |
| స్పెయిన్ | ,, | ౨౭ | ,, |
| ఫార్సి | ,, | ౩౨ | ,, |
| ఉర్దూ | ,, | ౩౬ | ,, |
| రష్యా | ,, | ౪౧ | ,, |
| సంస్కృతము | | ౫౨ | ,, |
| అబిసీనియా | ,, | ౨౦౨ | ,, |




## ఓరుగల్లు

(స్వకీయ విలేఖరి)

ఇచ్చట ప్రస్తుతము కలరావ్యాధి వ్యాపించుచున్నది. ప్రభుత్వమువారు నివారణోపాయ ప్రయత్నములు సలిపెదరు గాక!

మెహరు ౯వ తేది మంగళవారము నాడు సాయంత్రము సుమారు ఆరుగు గంటలకు ఈవ్యాధి వలననే శ్రీయుత కోటేశ్వరరావు గారు పరమ పదించిరని తెలుప చింతించుచున్నాను. వీరిచ్చటి ఉన్నత పాఠశాల మాధ్యమిక పాఠశాల స్థితిలోనున్నప్పుడు ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. సుమారు పది సంవత్సరముల క్రిందట ఉపకారవేతనముపై ఉద్యోగమును వదలుకొనిరి. అయినను వీరియందు మరణకాలమువరకు విద్యార్థులకు నమ్మకముండెను. ఉద్యోగమును వదలుకొనినను కొంతకాలమువరకు ఇస్లామియా పాఠశాలయందును, పిమ్మట కృష్ణాప్రైవేటు స్కూలునందును ఉపాధ్యాయ పదవిపైనుండిరి. వీరి దహనాది అంత్యకర్మలు జరుగువరకు వీరి జామాతయు, విఖ్యాతి ఆంధ్ర న్యాయవాదులగు జమలాపురము గోపాలరావు గారు మిక్కిలి కృషిచేసిరని తెలిసినది. వీరి పవిత్రాత్మకు శాంతి లభించుగాక! వారి కుటుంబము వారికి మా సానుభూతి చూపుచు ఇంతటితో విరమించుచున్నాము. వీరి మరణమునకు విషాద సూచకముగా ౧౧వ తేదిన ఇచ్చటి ఉన్నత పాఠశాల మూసివేసినట్లు తెలిసినది.

## పాల్వంచ సంస్థానము

(ఒక విలేఖరి)

కలరా

బూర్గం పహాడునందు కలరా తగ్గిపోయినది. ఇందులకు శాల్వాతహశ్శీలుదారువారు అనేక యౌషధములు తెప్పించి పేదసాదల కుచితముగ వినియోగింపజేసి ప్రజోపకారపరులైరి. ప్రజలు చాలభీతావహము పొందిరిగాని యిప్పుడెచ్చటను ఉన్నటుల కాన్పించుటలేదు.

శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషా నిలయము

కుక్కునూరు

భాద్రపదమున ఆంధ్రవిశ్వ విద్యాలయమువారు పని కల్పించుటచేత, యీనిలయ వార్షికోత్సవమున కాహ్వానింప బడిన బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామ శాస్త్రిగారు ప్రస్తుతము రావీలు లేదనియు, ఆశ్వయుజ శుద్ధమందు నిష్కర్షగ వచ్చెదమనియు తెలుపుటచే వారు దయచేయు నప్పుడు జరుపబడును.

శ్రీకృష్ణ జయంతి

ఇచట యీ జయంత్యుత్సవము నిలయమున భజనలతోను, ఉట్లుకొట్టుటలతోను, వసంతోత్సవములతోను పురాణ కాలక్షేపములతోను వైభవముగ జరుపబడెను.

సంస్థాన లోకల్‌ఫండు పాఠశాల

ఈ గ్రామమున విచ్చేసిన మహారాజు విన్నపము నాలకించి శ్రీశ్రీ సంస్థాన ప్రభువులు, పాఠశాలకు ప్రత్యేకస్థలము గ్రామమధ్య స్థలమున నున్నది యొసంగి, గృహనిర్మాణ మొనరించుటను కూడ యంగీకరించి ఎస్టిమేషన్ ప్లాను తయారుచేయించి పంపుట కాజ్ఞ నొసంగిరి. దయామయులగు ప్రభువువారు పాఠశాల పురోభివృద్ధికి ప్రజానుకూలముగ తోడ్పడు చున్నందుల కెంతయు సంతసించుచున్నాము. శీఘ్రకాలములో పాఠశాలకు శాశ్వత గృహనిర్మాణమును, ఉపాధ్యాయునికి వేతనాభివృద్ధి గావించి, స్థిరత్వమును జరుగగలదని యాశించుచున్నారము.

## మహబూబు నగరము

(స్వకీయ విలేఖరి)

కాలమానము

రెండు వారముల క్రిందటివరకు మించుమించుగా రాత్రిందినములు ముసురు పట్టివానలు కురిసియుండెను. ఈ వానలు మెట్టపంటలకు నష్టదాయకములు.

జిల్లా యారోగ్యము

ఎడతెరిపి లేక వానలు కురియుటచేతను, ఎండయను నదియేదు దినములుగ గన్పడక యుండుట చేతను, మలిన పదార్థములన్నియు కుళ్లి దాని దుర్వాసనను తేమను వహించి వీచువాయువులు సంపూర్ణారోగ్యవంతునికిని విషతుల్యమయినవి ఇక మునుపే ముక్కుడియయిన రోగికిద్యావి పైన పడితమునంటివి. కొన్నికొన్ని చోటుల కలరా [వాంతిభేది] రోగముగూడ పొడచూపు చున్నదని వినికిడి. మాయూర మాత్రము రిక్త గ్రహణి, అతిసారము, ప్రబలముగా నున్నటుల డాక్టరు హాఫీజ్ గారివలన తెలిసినదట

అగ్నికి వాయువు

పై పరిస్థితులుతోడు ప్రబలియున్న దోమకాటును సూక్ష్మక్రిమి సంతానము పెంచు మాయూరి కొరాయిల నీరును విషజ్వరములకు కారణమయ్యె. ఎన్నికోల మారంపము కొంగానే జిల్లా అధికారుల శ్రద్ధ కూడ పురపారిశుద్ధ్యము గూర్చి తగ్గినది.

కుక్కకు గతుకుపేగతి

పట్టణము యొక్క యభివృద్ధియందు శ్రద్ధాళురయిన మాతాలూకాదారుగారు ఇచటికేగి, హైదరాబాదునకును రాకపోకల సౌకర్యము గలిగింపనెంచి రెండు స్టేషనుల మధ్యనొక లారీల మోటారు నడిపింప, నా శాఖవారితో నుత్తర ప్రత్యుత్తరములు జరిపిరి. అద్దాని పర్యవసానము చాల విచారకరముగా ప్రస్తుతము వీలులేదని తెలిసినది. ఇతరత్ర సౌకర్యములు సాధ్యములయినను మాయూరి యదృష్టము మాత్రమింతియే. మాయూరి ప్రజల కేపాపమును కలియదు వారికున్నది యుండిన జాలును. ఏటికెదురీదుటలు తెగబారిన కుక్కకు గతుకుపేగతి కదా.

కృషితో నాస్తి దుర్భిక్షం

మాతాలూకాదారుగారి మాత్రము ప్రయత్నము వలన లుకార్యభీరువులుగారని మేమెరుగుదుము వలన, వారు మాయూరికి ఎలెక్ట్రిసిటీ సప్లయి చేయించుటకు లోకల్ఫండు ట్రెజరీకోరుచున్న రు॥ ౧౫౦౦౦ ప్రపంపెండు వేలుకు దోమ పర్యాయము వారు కొంతసాయము జేయవలయునని ప్రయత్నించుచున్నారు. వీరి ప్రయత్న పరంపర శీఘ్రములో ఫలవంతమగు గాక

రాకపోకలు

శనివారము నాడు హైద్రాబాదు లాకాలేజీ లెక్చరరుగా మార్చబడిన మాయూరి హైస్కూలు హెడ్మాస్టర్ అల్లావుద్దీన్ అహమదు బి.ఏ. [ఆనర్సు] బారిస్టరు గారు మధ్యాహ్నము బండిలో హైద్రాబాదునకు బోయిరి. స్టేషన్ యొద్ద వీరిని మాయూరి ముఖ్య శాఖల యాఫీసరులును, స్కూలు పిల్లలు, నుపాధ్యాయులును చేరియుండిరి. రైలు కదలుటతోడనే వారిని పూలమాలలతో బుష్పమాలాలంకృతులగావించి, యుపాధ్యాయులలో నొకరు వారికొక యుంగరము దొడగిరి. అందఱును గలసి వెండిగల యొక చేతికఱ్ఱ నొకదాని నిచ్చిరి. ఏమియు వియోగము లేనివారు తమ ప్రేమాలాపముల వ్యక్తీకరించిరి. ఎల్లర మాటలకు ప్రత్యుత్తరము లిచ్చుచు దమ బాలుర దీవించుచు నెల్లరి యాశీర్వచ శంసావాక్యముల గొని యేగిరి.

అదే బండిలో పోలీసు సూపరింటెండెంటు గారును హైద్రాబాదునకు బోయిరి.

ఆనాడు మధ్యాహ్నము బండిలో మెడికల్ శాఖా అసిస్టెంటు డైరక్టరు గారగు మేజర్, అబ్రహాం గారచటి యాసుపత్రి దర్శింప దయచేసిరి. మేజరుగారు మాయూరి యాస్పత్రిలో నేమేమి యభివృద్ధులు గావలెనో కనుగొని వ్రాసియున్నది. దౌరాపై బోయియున్న తాలూకాదారుగారు సోమవారము నాడు స్వస్థానము జేరియున్నారు.

మహారాజాగారి యాగమనము

కౌన్సిలు ప్రసిడెంటు గారగు శ్రీ మహారాజా కృష్ణప్రసాదు బహద్దరు గారు మంగళవారము నాడిచటికి దయచేసి మూడు దినములుండిరి. ఏర్పాటులు చాల తీవ్రముగా నుత్తమముగా జరిగినవి.

పంచకూళ్ల కషాయము

మాయూరిలోనొక కమసాలి యొకనితో నొక వడ్డెర యిల్లాలు గలదు. వీరిద్దరికి నొక సుజాత పుట్టినది. ఈయమను గుల్బర్గాలోని వేరొక కమసాలి కొంత ధనమిచ్చి కొని, పెండిలి యయ్యెనట. ఆట్టి పతి పేశులందు దన యింటనుండు కొనక రజస్వల కాని కారణమున దల్లిగారింట యుంచి పోవుటచే, దబ్బా సగళ యాతల్లి వేరొక మహమ్మదీయ సాదర్నుని వలన వైకము సంపాదించుటకు దన బిడ్డదేహము విక్రి

యోగించు చుండెను. నేను మొదటి యిల్లుకు భార్యను బంపమని నిర్బంధించగా దండ్రియు, దల్లియు బిడ్డయు జామ్మా వసీమునకేగి మహమ్మదీయ మతము వగలియుటుకై ముసల్మాను సోదరుని చెరసిరు స్త్రీని వేరు. పొలవంటి మేలము చెడెనని ఖరీదుకు గొనిన యిల్లుకు వదలి పోయెనట. ఇట్టి వింతలు మాకు స్త్రీ జాతుకు కొని యొక మతమున వీరలకు శరణ్యము అభించినందుల కాశ్చర్యమగు చున్నది

## మడుపల్లి

[ఒక విలేఖరి]

### పశువులు గ్రుడ్డివగుట

ఈ గ్రామపు పోలీసు పటేలుకున్న భూమిలో యొక చిన్న శిథిలమైన మయిసమ్మగుడి [కాళికాలయము] యుండెను. పటేలుగారు దానిని దీసివేయించి, దాని యడుగునమున్న భూమిని దున్నించిరి. ఇటుల చేసిన నెలదినముల తరువాత, వారివి ఆరుపశువులు పూర్తిగా గ్రుడ్డివై పోయెను. జనులు మయిసమ్మగుడి కూలగొట్టుట వలననే, ఇటులయినదని యనుకొను చున్నారు. కాళికాదేవియందు మూఢభక్తిగల దుర్మార్గులెవరయిన పశువులు గ్రుడ్డి యగునటుల, వాటికన్నులలో నేదయిన మందుబోసి యుందురు.

### కలరా వ్యాధి

చుట్టుపట్టు గ్రామములలో కలరావ్యాధి ఎక్కువగుచున్నది. ఈ గ్రామపు తాలూకాయగు హుజూరాబాదునందు ప్రతిదినము ౪-౫ మంది చనిపోవుచున్నారట. ఇతర గ్రామములనుండి యీగ్రామమునకు జనులు రాకుండా ఏర్పాటులు జరుగు చున్నవి. పంచాలవాండ్లు [మంత్రకొండ్లు] యీ గ్రామమునకు రాకుండా యేర్పాటు జేయబడినది. పంచాలవాండ్లను యూరిలోనికి రానివ్వకుండాజేయుటకంటె, గ్రామము పరిశుభ్రముగా నుంచుటయు, గ్రామస్థులు తమతమ యిండ్లను పరిశుభ్రముగా నుంచుకొను నటుల యేర్పాటు జేయుటయు మొదలగు ప్రయత్నములు జరిపిన బాగుండును.

### కాలస్థితి

మొన్నటి దినము సుమారు ౫-౬ ఘంటల వరకు వర్షము కురిసినది. ఇదివరకు వాడిపోవుటకు సిద్ధముగా నున్న మొక్కజొన్న పైర్లు మరల కొంచము తెలివి మీదికవచ్చి పిలకలు వేయుచున్నవి. వరిపైరు విషయమున కూడ ప్రజలకు కొంచము ధైర్యమువచ్చి యున్నది.

## జీడికల్లు

(ప్రత్యేక విలేఖరి)

### కలెక్టరుగారు

జనాబు ఖాజీ ఉబయిదుల్లా సా॥ అవ్వల్ తాలూక్దార నల్లగొండ గారు షహరేవరనాడు జీడికంటికి వేంచేసి యొక వారము రోజులు నివాసము చేసిరి.

### చెట్లు

శ్రీ రామచంద్రస్వామి సన్నిధిలో నున్న చింతలపై అర్చకు లశ్రద్ధజూపుట వలన గ్రామోద్యోగులా చెట్లను ఖండించిరి. ఇందుకు జనాబుగారెంతయో సంతాపపడి ప్రస్తుతము ఫలదకముల చెట్లు నారువందల పెట్టవలెనని లోకల్ఫండువారికి వ్రాసిరి. అపుడే గ్రామోద్యోగులు అపరాధ క్షమాపణార్థమై ఆరువది చెట్లను బెంచుట కొప్పుకొనిరి. నూరు గుంటలు సర్కారి పెరగునుండి సిద్ధమైనవి. కొన్ని చెట్లు తాలూక్దారుగారు స్వయముగా నాటించిరి.

### గ్రామోద్యోగులు.

ప్రతిసంవత్సరము ప్రభుత్వము పన్నును నిర్ణయతిథికి బంపక పోవుటయే గాక ఈ పేసంగిపన్ను ఇంతవరకు బంపలేదు. కావున గ్రామోద్యోగులకు కొంత ధన దండన జరిగెను

## మంథెన

### గ్రంథాలయము

ఈ ఆంధ్ర భాషానిలయపు చతుర్థ వార్షికోత్సవము, బ్ర శ్రీ జక్కు హనుమంత శాస్త్రిగారి యాధిపత్యమున, శ్రావణ శు॥ ౧౪ శుక్రవారమునాడు, జయప్రదముగా జరిగినది. మాతేరాం రాధాకృష్ణ శర్మగారు దైవప్రార్థన చేసిన తర్వాత, సభ్యులు సెన్నుకొనిరి. కార్య దర్శిగారు సంవత్సర నివేదికను చదివిరి లోకేగారి లక్ష్మణ శర్మగారు, గ్రంథాలయముయొక్క నాల్గు సంవత్సరముల సంగ్రహ చరిత్రను వినిపించిరి. వచ్చు సంవత్సరమునకు ఈక్రింది విధముగా సెన్నికలు జరిగెను.

అధ్యక్షుడు: మ॥ రా॥ వాసు దేవరావు సాఖరేగారు

ఉపాధ్యక్షుడు: ,, గంగాధర రావుగారు

కోశాధ్యక్షుడు మరియు కార్యదర్శి ఆవఘాని కృష్ణయ్యగారు,

సహాయ కార్యదర్శి: మాతేరాం రాజేశ్వరరావుగారు

అనంతరము గ్రంథాలయాభివృద్ధి, ఐకమత్యము గూర్చి ఉపన్యాసములు జరిగినవి.

ఈ గ్రంథాలయ భవన నిర్మాణ విషయమై, మ. రా. శ్రీ రావు బహద్దుర డి. లక్ష్మీనారాయణగారి యొద్దకు మ. రా. సుసర్ల గంగాధర రావుగారి ద్వారా దరఖాస్తు నంపుకొనగా, వారే స్వయముగా కార్తిక మాసములో విచ్చేసి. గృహమును కట్టించెదమని వాగ్దాన మొనర్చిరి.

ప్రస్తుతము ౩౮ చందాదారులు కలరు. ఆదాయము ౧౦ రు. నిలువ ౩౪౭ రు. ఆంధ్ర గ్రంథములు ౫౩౭. వీనిలో ౨౧౧ మాత్రము కొనినవి. ఆంధ్రేతర గ్రంథములు ౩౩౭ వీనిలో ౩౧ మాత్రము కొనినవి. నాల్గు సంవత్సరములలో సుమారు ౧౭౦౦ విరాళములు వొసికినవి. గోలకొండ, తెనుగు, భారతి, సుజాత, దేశబంధు, ఆంధ్రవైద్యసమ్మేళనము, ఇండియను డెలిమెయిలు, ముక్తిదర్శనీ, చిత్రమయజగత్, మహిళాపత్రిక అను పత్రికలు వచ్చుచున్నవి గ్రంథాలయము త్వరలో వృద్ధి చెందునని నమ్ముచున్నారు.

ఇట్లు
లో. కే గారి లక్ష్మణశర్మ
ప్రచారకుడు




### ఆండ్రూసుగారు గాయపడుట

ఆండ్రూసుగారు మహాత్మా గాంధీగారిని దర్శించుటకై బెంగుళూరుకు పోయిరి. మహాత్ముడు కుమార పార్కునందు మకాముచేయుచుండిరట. ఆండ్రూసుగారు వారిని కలసికొనుటకై తొందరపడి నడుచుచుండ రాయి తగిలి క్రిందపడిరి. వారిచేతికి గాయములు తగిలినవి. మహాత్ముడు స్వయముగ పట్టీలు కట్టిరి.

శాస్త్రీగారి వద్దనుండి వీరికి కేబిలు అందినది. అందు వారు తాము ఆరోగ్యముగ నున్నట్లును, ట్రాన్సువాలు భారతీయుల స్థితి దుర్భరముగ నున్నట్లును తెలిపిరి. దీనికి కారణము ట్రాన్సువాలు బ్రిటిషు ఇండియన్ అసోసియేషను శాస్త్రీగారి కోరికపైనను కూడ కాంగ్రెసునందు చేరకుండుటయే. ఆండ్రూసుగారు ౩౦ తేది చెన్నపురి చేరిరి. వీరికి కార్పొరేషను వారు సన్మానపత్ర మొసగెదరు.

### మైసూరు రాజభవనముల యందు దొంగతనము

రాజభవనములందలి కోశాగారము నుండి ౨౨ వేల రూపాయలు దొంగలింపబడినవి. రాజభవనము అధికారులు ముగ్గురు అరెస్టు చేయబడిరి.

### అస్పృశ్యులను గణపతి యుత్సవములో పాల్గొననిచ్చుట

బొంబాయియందు బ్రాహ్మణ సభవారు సమావేశమయి గణపతి యుత్సవమునందు అస్పృశ్యులు తమ మేళాలతో వచ్చి పాల్గొనవచ్చుననియు తీర్మానించిరి. శ్రీశంకరాచార్యుల స్వాములవారు కూడ వారిని పాల్గొననిచ్చుటకు తంతిపంపియున్నారు.

### షౌకతలీ సా॥ లేఖ

షౌకతలీ సా॥ డాక్టరు మూంజిగారి లేఖ పంపియున్నారు. అందువారు దేశము పరస్పర యుద్ధమునకు దిగుచున్నదనియు, కనుక ఇరువురును చేతులు కలిపి సంఘ ద్వేషము పారదోలుటకు ప్రయత్నించవలయుననియు సూచించిరి.

### జర్మనీ స్త్రీ హిందూమత స్వీకారము

మిస్ మార్గరటు గ్రబిగాహోలు బర్నస్విక్ నుండి భారత దేశము వచ్చెను. ఇపుడు ఈమె హిందూమతము స్వీకరించి ఒక యెలక్ట్రికల్ ఇంజినీరును పెండ్లాడెను. ఈమె క్రొత్తపేరు ఇందు బాలాదేవి.

### రిజర్వు బ్యాంకు బిల్లు

భారత శాసన సభయందు తీవ్ర చర్చజరిగిన పిదప బ్యాంకు స్టేటు బ్యాంకుగ నుండవలయుననెడు సిద్ధాంతమును, డైరెక్టరుల బోర్డునందు భారతీయులు అధికముగ నుండవలయునను సిద్ధాంతమును, ఆర్థిక సభ్యుడు అంగీకరించెను.

### పండిత నెహ్రూగారు

వీరు తమ న్యాయవాద వృత్తికి సంబంధించిన కార్యములపైన ౩౧ వ తేది ఇంగ్లండుకు పయనమై పోయిరి.

### నాగపూరు సత్యాగ్రహము

చతురబాయి కోటకు గారిని అరెస్టుచేసి ఒక సంవత్సరము విడికైదు విధించిరి. ఇంతవఱకు స్త్రీలను అరెస్టు చేసియుండలేదు. కాని స్త్రీలు కూడ ఆయుధ శాసనోల్లంఘనమునందు నాయకత్వము వహించుచున్నందున అరెస్టు చేయవలసివచ్చినదట. ముగ్గురు సత్యాగ్రహులకు ఒక సంవత్సరము కఠిన శిక్ష విధింపబడినది.

### సర్వ రాజకీయ పక్షముల కలయిక

సిమ్లానందు జిన్నా సా॥ యాజమాన్యమున సర్వ రాజకీయ పక్షముల నాయకుల సమావేశము జరిగినది. దిగువ సందేశము ప్రకటింపబడినది:—

మేము ఏకాభిప్రాయులగుటకు నిశ్చయించితిమి. మమ్ము విభజించుచున్న విషయములన్నియు నొకేనాటి సుహృద్భావముతో పరిష్కరించుకొనెదము. దీనికి తగినమార్గము తెలిసికొనెదము. వివిధ సంఘములయందు శాంతి, ప్రేమ, కలుగుటకు ప్రయత్నించెదము. ప్రపంచము నందలి నాగరిక జాతులలో భారత దేశమునకు కూడ స్థానము సంపాదించెదము.

### కాన్పూరు అల్లరి

కాన్పూరునందు హిందువులు మహమ్మదీయులకు కలహము జరిగినది. ఈ సందర్భమున ౨౫౦ మంది అరెస్టు చేయబడిరి. సైనికులు వీధులు కావలి కాచిరి. ఇంకను పరిస్థితులు చక్కబడలేదు. పటకా పూరాయనందలి హిందూ దేవాలయములోని విగ్రహములను మహమ్మదీయులు పగుల గొట్టిరట.

### వంగరాష్ట్ర శాసన సభ

స్వరాజ్య పార్టీ వారిచే ఉపపాదింప బడిన మంత్రుల విశ్వాస రాహిత్య తీర్మానము అధిక సంఖ్యాకులచే ఆమోదింప బడినది. మంత్రులగు గజనవీ సా॥ను, చక్రవర్తి గారును రాజీనామాల నొసగిరి. నూతన మంత్రుల కొఱకు ప్రయత్నములు జరుగుచున్నవి. చెన్నరాష్ట్ర శాసన సభయందీ తీర్మానముపపాదింపబడినను నెగ్గలేదు.



### హాస్యలత

---

### వినికరి సాక్ష్యము

ఒక జడ్జి న్యాయశాస్త్ర మందొక వెంట్రుకంత లోపము లేకుండ తీర్పు చేయువాడనిపించుకొనవలెనని యాశించెను. ఒకనాడొక డింకొకని తుపాకితో కాల్చి చంపిన విచారణ ఆతని యెదుట వచ్చెను. ఒక సాక్షిని పిలిచి „ఓయీ, నీ వితడు తుపాకితో కాల్చుట చూచితివా” అని యడిగెను.

సాక్షి —అయ్యా, తుపాకి శబ్దము మాత్రము వింటిని. తుపాకితో కాల్చుట యెట్టిదో నేను చూడలేను.

జడ్జి — ఇది వినికరి సాక్ష్యము (Here say) పనికిరాదు. నీవాంగలసాక్ష్యము. సాక్షి ప్రక్కకు పోయి జడ్జిగారి తెలివి గేటలను జూచి పక్కున నవ్వెను. జడ్జి వానిని మరల తన యెదుటికి పిలిచి „ఓరీ, నీవు నవ్వుచున్నావు కదా! ఇంతపెద్ద కోర్టునందు చులకనగ నవ్వుట తప్పు. కోర్టు ధిక్కారము చేసితివని శిక్ష వేసెదను”

సాక్షి:—దొరగారూ, నేను నవ్వినది వినికరి సాక్ష్యమండి. మీరేమియు చూడలేదు గదండీ!




## ఐకమత్య సందేశము

భారత దేశమునందు సంఘ ద్వేషము దినదినము ప్రబలుచున్నది. ఎటుజూచినను హిందూ మహమ్మదీయ తగవులు గాన్పించుచున్నవి. స్వల్పకలహములే మత యుద్ధములుగా మారుచున్నవి. ఇంతవరకెన్ని సభలు జరిగినను, ఎన్ని సంధి పత్రములు వ్రాసికొనినను ఫలితము అన్యథా పరిణమించినది. భారత దేశమిట్లు అధోగతిపాలగుచుండ ఏ శాంతి ప్రియుడు విలపింపకుండును? దేశమునందల్లరులు జరుగుచుండిన యే సంఘము వారికయినను లాభము కలుగునా?

ఈ విషమ పరిస్థితులు వీక్షించుటచే రాజప్రతినిధులగు ఇర్విను ప్రభువుగారి హృదయము కరగిపడి. వారు అన్ని పక్షముల వారియందైకమత్య మవసరమని తలంచిరి. వీరి ప్రసంగము ఫలితముగ సిమ్లా చల్లని ప్రదేశమున సర్వరాజకీయ పక్షనాయకులు సమావేశమై ఈ విషయమై ఆలోచించి దేశీయులకు విన్నపము ప్రకటించిరి. అందరు ఐకమత్యముతో నుండవలయునని ప్రబోధించిరి. లేనిచో జాతీయ వికాసము కలుగనేరదని విలపించిరి. నాయకులందరును తమ భేదములు విడనాడుకొనుటకు సమ్మతించిరి. అయినను యిట్టి విన్నపముల వలన పరిస్థితులు చక్కబడునా? "ఐకమత్యము ఐకమత్యము" అని ఒక వంక చల్లని ప్రదేశమునందుండి నాయకులు ఉద్ఘోషించుచుండ వేరొకవంక కాన్పూరునందు పరస్పర కలహము జరుగుచునే యున్నదికదా?

దేశమునందు శాంతి సమకూరుటకు దేశీయుల భావములు మార్పుగాంచవలయును. నాయకులు ప్రజల కార్య ప్రాయులు గనుక వారుక్షమమున్నంత తమలోగల భేదాభిప్రాయములు విడనాడుకొని ఏక కంఠముతో జన సామాన్యమునందు ప్రచారము గావించవలయును. అందరు నొకే మార్గమునకు దారి చూపవలయును. ద్వేష భావములు ప్రజ్వరిల్ల జేయుచున్న సంఘములను, వ్యక్తులను, బహిష్కరించవలయును. అపుడే మైత్రి సమకూరునుగాని వట్టి విన్నపముల వలన గాదు. ఒకరి మతమును, ప్రవక్తలను ఒకరు గౌరవించవలయును. ఈసందర్భమున మౌల్వీ లియాకత్ హుసేన్ సా|| ప్రకటించిన విజ్ఞప్తి యెల్లరు గమనించ దగినది. గోవధ విషయమై ముసల్మానులు పోరాడ నవసరము లేదనియు, బక్రీదు సందర్భమున గోవులను వధించుటకు బదులు, వానిని కొనుటకై వెచ్చించు ధనము ధర్మకార్యములకై వినియోగించవలెననియు, వారు సూచించుచున్నారు. ఇదేవిధముగ మసీదుల యెదుట వాద్యము లాపుటకు ఖురాను విధించుటలేదని వీరితలంపు. హిందువులు గూడ ఇతరులను తమ మతమునందు చేర్చుకొనిన ఆక్షేపింప కూడదని వీరి అభిప్రాయము. హుసేన్ గారు తమ సోదరులను పై విషయములు గూర్చి అంగీకరింపజేసి దేశమునందు ఐకమత్యము స్థిరముగ నాటుకొనునట్లు జేయుదురు గాక. ఇరు సంఘముల వారును హృదయ పరివర్తనము గావించుకొనిన భేదములన్నియు సమసి పోగలవు. హిందూ మహమ్మదీయ మైత్రి సాధ్యమైనదియే. దీనికి నాయకులకెల్ల యికయే ముఖ్యావసరమయి యున్నది. భారత దేశమునందు త్వరలో సంఘద్వేషము సమసిపోవు గాక.

## గణపత్యుత్సవములు

ఉత్సవములు ప్రతిజాతి యందలి జీవకళను వెలిబుచ్చును. అవి జాతీయ స్వరూపము దాల్చినప్పుడా జాత్యభివృద్ధి త్వరితముగా గలుగునని నమ్మవచ్చును. ప్రతిజాతి యందును సామాన్యుల సంఖ్య యెల్లప్పటికి ఎక్కువగానే యుండును. ఆ జనసామాన్యము సిద్ధమైననేగాని యేజాతీయోద్యమమును సఫలమంతము గానేరదు. సామాన్యజనుల నాకర్షించుటకు మతముకంటె బలకరమైన అయస్కాంతము వేరొండు లేదు. తరతరముల నుండి మతముపై కలిగిన యభిమానమునకు కొంత చలనము కలిగించినచో జనసామాన్యము పట్టపగ్గములేక ముందంజ వేయును. కాని సరియైన నాయకత్వము లేక నిట్టి సంచలనము పుట్టింపబడినచో లాభమునకు మారు నష్టమే యెక్కువ సంభవించును.

లోకమాన్య బాలగంగాధరుడీ రహస్యమును కనుగొని యేపనిని మొదట యెత్తుకొనవలెనో దానినే ప్రారంభించెను. విద్యావంతుల కొరకును, విద్యాశూన్యుల కొరకును ఒకటే ఔషధమును సృష్టించెను. అది ప్రజాపూజ, వీరపూజ, దేవపూజ. శ్రీ ఛత్రపతి శివాజీ మహోత్సవ మారంభించి దేశమునందలి పౌరుష జీవుల నాకర్షించెను. గణపత్యుత్సవము ప్రారంభించి విద్యావంతుల పైనను, పామర జనులపైనను, జాతీయ భావానిలమును ప్రసరింప జేసెను. శారదోపాసకుల తృప్తి పరచుటకు 'గణపతి' శబ్దార్థము 'ప్రజానాయకుడ'ని సాధించెను. జన సామాన్య మైక్యమగుటకై విఘ్నేశ్వరుని పూజించినచో సర్వవిఘ్నములు బాయుననియు, అందరును కలిసి ఆ మహాదేవ పుత్రుని పూజించి ముక్తి బొందవలెననియు బోధించి వారిని తనవారిని జేసికొన సాగెను.

మహారాష్ట్ర దేశమా మహా పురుషుని జీవితకాలమందే యీ యుత్సవములు మొదలుపెట్టెను. ప్రస్తుతము మహారాష్ట్ర దేశమునందు సామాన్యమైనటుల దేశభక్తి మరే భరతఖండ ప్రాంతమందు కనబడదు.

ప్రజా శక్తిని ప్రజ్వరిల్ల జేయునట్టి యీ గణపత్యుత్సవములు అదృష్టవశమున మన రాష్ట్రమునందును మహారాష్ట్ర సోదరుల వేర్వేరు సంఘములచే ౫. ౬ సంవత్సరములనుండి జరుపబడుచున్నవి. ముఖ్యముగా నీసంవత్సరము వానిసంఖ్య చాల ప్రబలినది. ఆంధ్రులు, ఉత్తర హిందూస్థానపు క్షత్రియులు, మార్వాడీయ్యాలు మొదలగు ఉపజాతుల వారందరును తమ తమ వీధులలో గణపతుల స్థాపించి అతి సంభ్రమముతో ఉత్సవముల జరుపుచున్నారు. ఇదివరకు వారి గణపతులు గృహముల దాటకుండెను. ఇంటి వారికితప్ప తదితరులకు వారియుత్సవముతో సానుభూతి లేకుండెను. ఇప్పుడది జాతీయోత్సవ స్వరూపము దాల్చినది. భాగ్యనగర హిందూ ప్రజలలో నీయుత్సవము చాల యుత్సాహము పుట్టించుచున్నది. ఇదియిక్కడి అభ్యుదయ సూచకమైన విషయము.



# స్థానిక వృత్తాంతములు

## ఆదిహిందువుల భాగ్యము

నిమ్నజాతు లభివృద్ధికై దాదాపు ౨౫ సంవత్సరములనుండి సేవజేయు చున్నట్టియు, తమ యమూల్యమైన జీవితమునంతయు, స్వజాతి సేవకే వినియోగించుచు, ఇట్టి మా ఆదిహిందూ నాయకులగు శ్రీయుత శ్రేష్టి మాగీ వెం॥ భాగ్యరెడ్డివర్మ గారియొక్క జీవిత చరిత్రమును, వారి యుపన్యాసములును, "భాగ్యవిజయ ధ్వజము" అను పేరుతో నొక గ్రంథమును హైద్రాబాదు ఆదిహిందూ సాహిత్య గ్రంథమాలవారు ప్రకటింప నున్నారని వినుట కెంతయు సంతస మగుచున్నది. శ్రీ వర్మగారి యొక్క యుపదేశములకై వేచియున్న ఎల్లరు ఆదిమాంధ్రులకును, వివిధ ప్రాంతములలో నిమ్నజాతులసేవ యొనర్చుచున్న సంఘములకును, యీ గ్రంథము మిక్కిలి సహకారియై ఆదర్శప్రాయమై వెలయగలదు. ఇంతటి విషయమై తగుశ్రద్ధతో పనిజేయు చున్న గ్రంథమాల అధ్యక్షులగు శ్రీ వడ్లకొండ నరసింహారావు పంతులుగారును, కార్యదర్శులగు శ్రీ తాడేపల్లి తాతయ్య, కమటం రామలింగము గార్లును యెంతయు వందనీయులు.

"ఒక ఆదిమాంధ్రుడు"

## చాదర్ఘాట శ్రీవైష్ణవ మహాజనసభ

### ద్వితీయ సమావేశము

శ్రావణ బ॥ ౧౪ శుక్రవారము పగలు ౨ గంటలకు గౌలిపురం శ్రీమాన్ అమరవాది వేంకయ్య గారి భవనమున వైదిక శాఖాద వాస్తవ్యులగు శ్రీమాన్ రామచంద్రయ్య భిషక్కుల యాజమాన్యమున సభ సమావేశమయ్యెను. సుమారు ౩౦ మంది సభకువిచ్చేసిరి. సంఘోద్దేశము గూర్చి శ్రీమాన్ వ. లక్ష్మీనరసయ్య, డి. రంగదాసు, టి కృష్ణమాచారిగార్లు ఉపన్యాసములచే నుపన్యసించిరి. శ్రీమాన్ టి. యస్. రామానుజన్ గారు దీనిని బలపరచుచు, శక్తిత్రయ (జ్ఞాన, సూక్ష్మ, క్రియా) లక్షణముల నిరూపించి ఐకమత్య అనైకమత్యముల వలని లాభనష్టములు సూచించిరి. అధ్యక్షులవారు సంఘోద్దేశమును గూర్చి ప్రతివారు ఆవశ్యకారిగా ప్రయత్నింప వలయునని ఉపసంహారోపన్యాసము గావించిరి. మరి సంఘమునకు సంబంధించిన ప్రతి విషయమును గూర్చియు, చర్చింప దలచినవారు కేంద్రసంఘ కార్యాలయమునకు వారికి వినతిపత్రిక (దరఖాస్తు) బంపుకొనవలయును. అందు జేరియున్న ౨౫ గురు కేంద్రసంఘ కార్యనిర్వాహక సభ్యుల అభిప్రాయము ననుసరించి మతధర్మ రీత్యా విషయములు చర్చింప బడవలయుననియు తీర్మానించిరి. సుమారు ౫ గంటలకు సభ జయప్రదముగా ముగిసెను.

## దొంగతనము

ఆలియాబాదు సంగు కాశీరాం అను మార్వాడి యింటిలో సుమారు రెండువేల రూపాయల నగలు అపహరింప బడినవి.

## బి. ఏ. కాలిన్సు దొరగారు

వీరు కామారెడ్డి, నాందేడు, పర్బని, ఔరంగాబాదు మున్నగు ప్రాంతములకు వెళ్లి గురువారము నాడు సాయంకాలము ౫ గంటలకు హైద్రాబాదుకు తిరిగివచ్చిరి.

## ప్లేగు

సికింద్రాబాదు నందు హిల్ స్ట్రీటు, నాకాబజారునందు ౨౫ ఆగస్టునాడు ౨గురు వ్యాధిగ్రస్తులయి ౨గురు మరణించిరి. ౨౯ ఆగస్టునాడు భోయిగూడెములో ఒకడు వ్యాధిగ్రస్తుడయి, ఒకడు చనిపోయెను.

ఆగస్టు ౩౦ తేది ౪ గురు వ్యాధి గ్రస్తులయి ఒకడు మరణించెను. ౩౧ తేది ౨ రు వ్యాధి గ్రస్తులయి ౨ రు మరణించిరి. ౧ సెప్టెంబరునాడు ౨ రు వ్యాధిగ్రస్తులయి ౧ మరణించెను. ఈ వ్యాధి వ్యాపించిన వీధులు ఘాసుమండి, ౧౫. బ్యాట్రీ ఫాలోవన్సు లైన్సు, హిల్ స్ట్రీటు, భోయిగూడెము. వ్యాధి ఆరంభము నుండి ౧౮ వ్యాధిగ్రస్తులై ౧౨ మరణించిరి.

## పర్బని పర్లీ రైలు

పర్బని నుండిపర్లీవరకు ౪౦ మైళ్ల దూరము రైలు వేయబడును.

## కంటోన్మెంటు సభలు

సెప్టెంబరు నెలలో బిల్డింగు కమిటీ, ఫినాన్సు కమిటి ౧౫ తేదినాడును, కంటోన్మెంటు బోర్డుసభ ౨౮ తేది నాడును జరుగును.

## సార్వజనిక గజానన సంఘము

### రెసిడెన్సీ బజారు

శ్రీగజాననోత్సవ సందర్భమున సంఘముపక్షమున జరిగిన సంధ్యావందన, సంస్కృత, ఐక్యత్వ పరీక్షలలో నుత్తీర్ణులైన విద్యార్థులకు బహుమానముల నొసంగుటకు హెడ్ పోలీసుస్టేషన్ దగ్గరనున్న శ్రీ సేటు మునిలాల్ గారి తోటలో నేడు సాయంకాలము ౫ గంటలకు సభజరుగును. మ॥ రా॥ రా॥ రంగనాయకులు నాయుడుగారు బి. ఏ. బి ఎల్. సెషన్ జడ్జి అధ్యక్షత వహించుటకు అంగీకరించిరి. అందరు దయచేయ ప్రార్థితులు.

పల్లూరి భీమరావు అధ్యక్షులు
రాపర్ల హనుమంతరావు కార్యదర్శి.

## కాలమాన నివేదిక

ఆగష్టు ౨౭వ తేది కంతమగు వారమున అనేక చోటుల కొద్దిగ వర్షము కురిసినది. సగటున ౦.౫౩ ఇంచులు. పునాస చేలు కలుపుతీయుచున్నది. పైరుల స్థితి బాగుగనే యున్నది. కాని ఫలించుటకు వర్షము కురియవలయును. కొన్నిచోట్ల కీటకములవలన పైరులు నాశనమయినవి. పశువ్యాధి రాయచూరు, గుల్బర్గా, మహబూబు నగరు, వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలయందు గలదు. [illegible] నివారణ పనులయందు ౧౨౨ కూలివాండ్రు పని చేయుచున్నారు. అచటనే ౨౬౨ గురికి ఉచిత సహాయము చేయ బడినది.

## నాందేడు కమిషను

౨౩ సెప్టెంబరునుండి యీ కమిషను సమావేశములు జిల్లాల రక్షక శాఖ కార్యాలయమున జరుగుచున్నవి.

## తామీరాతు అధ్యక్షులు

నవాబు లుత్ఫుద్దౌలా బహదురుకు నెలకు ఒక వేయి రూపాయిల ఉపకార వేతన మిచ్చుటకు ప్రభువుగా రాజ్ఞాపించిరి.

## సదరుమహాసబీ ప్రకటన

అబాన్ నెల ౨౩, ౩, ౪ తేదీలయందు దహాజం షరీఫు సెలవులుండుటచే వేతనములు ముందుగనే ఇవ్వబడును.

## ఉ. మెట్రిక్యులేషన్ పరీక్ష ఖాస్గీ విద్యార్థులు

ఉస్మానియా విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్షకు ఇకముందు ఉస్మానియా హైస్కూలు నందును విశ్వ విద్యాలయము వారిచే అంగీకరింపబడిన ఉన్నత పాఠశాలలందును, కనీసము ఆరునెలలు విద్యాభ్యాసము జేసిన వారినే ఖాస్గీగ పరీక్షకు తీసికొనెదరు. ఇంటియాకోక పరీక్షా సమయమున హాజరీ తక్కువ నుండుటచేతనో లేక ఇతర కారణముల చేతనో ఖారిజ్ చేయబడు విద్యార్థులు ముందు పరీక్షలో చేర్చుకొన బడరు.

## తపాల శాఖాధ్యక్షులు

నవాబు సర్దారునవాజు జంగుబహదురుకు నెలకు రెండువందల రూపాయిల లోకలు అలౌన్సు ఆపుగల చేయబడిన తారీకునుండి యొసంగుటకు ప్రభువుగారాజ్ఞాపించిరి.

## తబాదిలా దరఖాస్తు

తబాదిలాకై కోరునపుడు యేకైన ముఖ్యావసరమున్నట్లును, ఏమైన తగుకారణము లున్నట్లును, సూచించియే దరఖాస్తు పేషు చేయవలయునని ఆజ్ఞాపింపబడినది.

## కల్యాణి జాగీరు

ప్రభువుగారి ఫర్మానుప్రకారము కల్యాణిస్టేటు ఖాల్సాలో చేర్చుకొనబడినది

## మహారాజా బహదురు

శ్రీకృష్ణప్రసాదు యెమినుస్సల్తనత్ గారు గత బుధవారమునాడు మహబూబునగరము నుండి తిరిగి వచ్చిరి.

## ఎజ్యుకేషనల్ కాన్ఫరెన్సు

మెహరు ౨౫వ తేది పైసభ కార్యనిర్వాహక సమావేశము ఉస్మానియా విద్యాలయ కళాశాలయందు నవాబు నదరుయారుజంగు బహదురు యాజమాన్యమున జరుగును. రాబోవు సమావేశము తేదినిర్ణయమును, ఇతర ఆర్థిక విషయముల గూర్చియును విచారింప బడును

## గుజరాతీ సహాయము

నిన్న చౌమహల్లునందు మహారాజా బహదురు యాజమాన్యమున సభ జరిగినది. అధికార ప్రముఖులును, ధనికులును, న్యాయవాదులును, సభయందు పాల్గొనిరి. మొత్తము రు ౧౨౫౨౦ లు వాగ్దత్తములు చేయబడినవి.

# సత్యాన్వేషణము

(కటంగూరి నారసింహారెడ్డిగారు)

మనదేశీయ సోదరులకు ప్రశ్నలడుగు యలవాటులేదు. తెలియని విషయములను, తెలుసుకొనవలయునను యభిలాషలేదు. క్రొత్త సంగతులను కనుగొనవలయునన్న కుతూహలములేదు. మన దేశీయులు పరిశీలన స్వభావులుగారు. మనలో ధూమశకటమును జూచిన వారెందరో యున్నారు. ప్రతిదినము దానిపై నెక్కి తిరుగువారెందరో యున్నారు. కాని అది యెటుల నడచునో తెలసిన వారెవరయిన నున్నారా? దానిని నెవరుకేసిరో తెలిసిన వారెవరయిన నున్నారా? దానిని గనిపెట్టిన వారిపేరు, కనుగొనిన వారెవరయిన నున్నారా? లేరు. ఉన్నను చాలా తక్కువగా నున్నారు.

గతిరెండు శతాబ్దములందు ప్రకృతి శాస్త్రములలో గలిగిన మార్పులను జూచిన ప్రతివారికిని చిత్రముగా దోచక మానదు. ప్రకృతి శాస్త్రముల వృద్ధి కనిపెట్టబడిన క్రొత్త వింతలు, తయారు జేయబడుచున్న క్రొత్త యంత్రములు, వస్తువులు ఇవన్నియు నెట్టివానినైనను, నాశ్చర్య మగ్నునిగ జేయును. పూర్వపు ౧౭-౧౮ శతాబ్దములలో, కనిపెట్టబడిన క్రొత్త సంగతులకంటె, గతరెండు శతాబ్దములలో గనిపెట్ట బడిన క్రొత్త సంగతులే, ఎక్కువగా నున్నవి. ఇటులగుటకు కారణమేమి? పూర్వులు మనవంటి మేధావులుగారా? [మనకంటె పూర్వులే ధీమంతులని చెప్పుటకు నిదర్శనములున్నవి.] వారు పరిశీలనా విధానము నెరుంగ కుండిరా? లేక వారిపరిశీలనా విధానముక్రమముగా లేకుండెనా? మరేకారణమున వారు శాస్త్రాభివృద్ధి జేయవలయునను యభిలాష లేకుండెనా? మరేకారణమున వారు శాస్త్రాభివృద్ధికి నెక్కువగా దోడ్పడ లేక పోయిరి. వారు ఎక్కువ పరిశీలన స్వభావులు గారని యనుకొందుము.

నివ్టన్ [Newton] అను గొప్ప ప్రకృతి శాస్త్రజ్ఞుడొకనాడు, తోటలో బచారు సేయుచుండెను. అతోటలోనున్న యొక సేపుచెట్టు క్రిందనుండి, అతడు బోవుచుండగా నొకసేపుపండు Apple రాలి యాతని తలపైబడెను. అపండు నాతడు దీసుకొని, తినుటకు మారుగా, „ఈ పండిటుల భూమిపై రాలుటకు కారణమేమి?" అని విచారింప సాగెను. ఇది ప్రపంచజ్ఞానము గలవాడడుగ వలసిన ప్రశ్నయా? యీ ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుటకు శాస్త్రజ్ఞుడు గావలయునా? ప్రాపంచిక జ్ఞానముగల వారెవ్వరైన యడిగినచో, పండుబండి రాలినదనియో, లేక గాలివీచుటచే రాలినదనియో, లేక పక్షిదానిని బొడిచి రాలగొట్టినదనియో, లేక నాకుదెలియదు, ఎటుల రాలినమనకేమి యనియో, వెంటనే ప్రత్యుత్తరమిచ్చి యుందురు. నివ్టన్ యిట్టి ప్రత్యుత్తరములతో సమాధాన పడక, సేబుపండు భూమిపై రాలుటలో నేదో గూఢ రహస్యమున్నటుల, భోజనమైనను జేయక యటుగూర్చొని „ఈపండు క్రిందబడనేల! పండుబండిన పో పైకెల నెగరగూడదు? నడుమనె యేలనిలువ గూడదు?" అని యాలోచింప సాగెను. ఇట్టి ప్రశ్నలడుగుటకు, నివ్వుటన్ పిచ్చెత్తినదయ్యెనా యేమియని శంకింపవలసి వచ్చుచున్నది. అతని సతీమణి [అతని కొక సతీమణి యుండెనేని] యిట్టి ప్రశ్నలను వినియున్నచో, తనభర్తనురల బాల్యావస్థలోనికివచ్చి యున్నాడని నిశ్చయించి, భర్తను గదిలోనుంచి వైద్యుని బిలువనంపి యుండును. కాని నివ్వుటన్ అదృష్ట వశమున భార్యకీసంగతి తెలియలేదు. అతనికట్టి మహాపద రాలేదు. కొంతకాలమున కాతడా ప్రశ్నకు, ప్రత్యుత్తరము గూడ నివ్వగలిగెను. అతడీవిధముగా „ఆకర్షణ సూత్రము" 'The low of gravitation', ను గనిపెట్ట గలిగెను.

నివ్వుటన్ కాలమునకు పూర్వము సేపు పండ్లు చెట్లనుండి క్రింద రాలలేదా? ఎన్నియో పండ్లు రాలినవి. ఎందరో వాటిని భక్షించి యున్నారు. కొందరు కసిగాయలను దిని యున్నారు; మరికొందరు పూర్ణముగా పక్వమైన పండ్లను దిని యున్నారు; కొందరు కత్తితో గోసికొని తినియున్నారు, మరికొందరు దంతములతో గొరికి తిని యున్నారు కొందరు వాటితో Pudding జేసికొని తిని యున్నారు, మరి కొందరు Sallad జేసికొని తిని యున్నారు. కాని యెవ్వరును, సేపు పండ్లు క్రింద బడుటకు కారణమేమియని విచారించలేదు. నివ్వుటన్ కాలమునకంటె పూర్వులు విమర్శన స్వభావులు గాకపోవుటచే „ఆకర్షణ సూత్రము" ను గనిపెట్టలేక పోయిరి; శాస్త్రాభివృద్ధికి దోడ్పడలేక పోయిరి.

మనము ప్రకృతి యందెన్నియో పదార్థములను జూచుచున్నాము. కాని అవి యటులుండుటకు కారణమేమియని విచారించుట లేదు. సున్నము తెల్లగా నుండనేల? బొగ్గు నల్లగా నుండనేల? బెల్లము తియ్యగా నుండనేల? ఇట్టి ప్రశ్నలకు ప్రత్యుత్తరము లిచ్చుట యసాధ్యముగా దోచవచ్చును, కాని ప్రయత్నించిన నష్టము లేదు. సముద్ర జల మాకాశ వర్ణమై యుండుటకు కారణమేమి? టిండాల్ [Tyndall] అను శాస్త్రజ్ఞుడు, సముద్రములోతుగా నుండుటచే యటుల అగుపడునని పలికెను. [Water when viewedThicklayers has an intrinsic] డాక్టరు రామన్‌గారీ సిద్ధాంతమును ఖండించిరి. వీరు వెలుతురును నలుప్రక్కలకు వ్యాపింప జేయునని యు, నీటిలో వెలుతురు నలు ప్రక్కలకు వ్యాపించుటచేత, యది యటుల అగుపడునని యు, సమాధానము జెప్పిరి. „సున్నము తెల్లగా నుండక మరెటులుండును?" అని యనుకొనుటయే కాని. సున్నమునల్లగా నుండక పోవుటకు కారణమేమి? అని యెల విచారించ గూడదు. ఇట్టి ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుట కష్టసాధ్యముగా నచ్చును. కాని ప్రయత్నము జేసినచో నెదో యొక ప్రత్యుత్తరమివ్వ గలుగుదుము. ఆ ప్రత్యుత్తరము సరిగా లేదని మరియొకరు బలికి, వారి యభిప్రాయము నివ్వవచ్చును. వారి యభిప్రాయమును ఖండించి మరొకరు క్రొత్త సిద్ధాంతమును జేయవచ్చును. ఈవిధముగా వాద వివాదములు, ఖండన మండనలు జరిగిన పిమ్మట, తుదకు సత్యము వెలియగును. ఊరక కూర్చున్నచో నేమియు కనుగొన జాలము. అడుగని దమ్మయైనను అన్నము పెట్టునుగదా!

మనుష్యుడు పాదములతో నడువనేల! తలతో నెందుకు నడువ గూడదు? ఇవి యున్మత్తుని ప్రశ్నల వలె యగుపడ వచ్చును. మరిగల వారికంటె యున్మత్తుల సంఖ్య నెక్కువగా నున్నచో, మరిగల వారే యున్మత్తులవలె నగుపడుదురు. దేశ సేవకయి, తమ జీవితములను ధారబోయుచున్న నాయకులు సంఘసంస్కర్తలు, మన దేశీయుల కున్మత్తులవలె నగుపడుట లేదా!

ఎన్ని ప్రశ్నలడిగిన మనుష్యుని తెలివియంత వృద్ధిబొందును. ప్రపంచము నెవరు సృష్టించిరి? ఏల సృష్టించిరి? మరణా నంతరము, మనుష్యు డేమగును? ఇట్టి ప్రశ్నలకు జవాబిచ్చుట నిజముగా కష్ట సాధ్యము. కాని, మన పూర్వులు ప్రయత్నము జేసి యుండుటచేతనే మత మేర్పడెను. మతము వలన జాతు లేర్పడెను. జాతు లేర్పడుట వలన పరిశ్రమలు వృద్ధిలోనికి వచ్చెను. సత్యము నన్వేషించుట చేతనే, బుద్ధదేవుడు „అహింసా పరమోధర్మః" యను సత్యమును ప్రపంచమున కివ్వ గలిగెను. విమర్శన స్వభావముగల శాస్త్రజ్ఞులే క్రొత్త సంగతులను గనిపెట్ట గలుగుదురు.

ఏ విషయమైనను, మనుష్యుడు మొదట నమ్మును—తరువాత శంకించును—పిమ్మట నిజము గనుగొనును. జ్యోతిష్యమును మొదట నమ్మెను—తరువాత జ్యోతిష్యము నిజమాయని శంకించును—పిమ్మట నక్షత్ర శాస్త్రమును (Astronomy) నేర్చుకొనును

## పరిభుత్వావసరములు పూర్తిజేయును.

ప్రపంచము నందన్ని సంస్థలును డాజ్ బ్రదర్స్ కమర్షియల్ బండ్లను పయోగించును. జమైకాలోని కింగ్స్టనునందును, బొంబాయినందున, దక్షిణాఫ్రికాలోని కేప్టౌనునందును, తపాల శాఖ వారును ఆస్ట్రేలియా నందలి ఇతర ప్రభుత్వ శాఖలును, ఈ బండ్లను వాడెదరని చెప్పిన తక్కువయే.

బలమైన ఫ్రేములును, స్ప్రింగులును, బలమైన ఇతర భాగములును నుండుటచే చాల ప్రయోజనకారియని మీకే తేలపడును. అందఱును ఇతర రకముల బండ్లకన్న డాజ్ బ్రదర్సు కమర్షియల్ బండ్లు చాల మేలైనవనియును, తక్కువ వ్యయముకే నివియు, వల చెప్పెదరు.

ఇతర వివరములు కోరువారును, ధరలు తెలుసుకొనువారును, దిగువ విలాసమునకు వ్రాయవలయును.



# Meets Government Specifications

Hundreds of public institutions througnout the world employ Dodge Brothers Commercial Cars. The Post Offices at Kingston, Jamaica, at Bombay, India; at Capetown, South Africa, and several government departments in Australia—to menton only a few.

Deep, heavy channel frames, reinforced all-vanadium springs, ample body dimensions, the prodigal use of fine alloy steels and drop forgings—all tell a story of exceptional efficiency. All tell why Dodge Brothers Commercial Cars render better and more economical service than most light trucks of much larger *rated* capacity.

| | |
|---|---|
| Dodge Brothers Screen Commercial Car | . . . |
| Dodge Brothers Touring Car | . . . . . |
| Graham Brothers 1-Ton Chassis | . . . . . . . |
| Graham Brothers 1½-Ton Chassis | . . . . . . . |

*Delivered*

బొంబాయి సైకలు ఏజెన్సీ

అండు మోటారు లిమిటెడ్.

౫-౨, ౫౩, జేమ్సుస్ట్రీటు

సికింద్రాబాదు (దక్కన్.

ఓల్డ్ గాంజ్—తోపుకాన్ స్ట్రీటు. టెలిఫోను నం ౨౧౨

# DODGE BROTHERS COMMERCIAL CARS

REG. No. N. 45.

REG. No. M. 2185

గోలకొండ పత్రిక.

ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్.

సంవత్సరము చందా రు. ౭-౦-౦

అర్ధసంవత్సరము ,, , ౩-౧౨-౦

విడి పత్రిక ౦-౧-౮

STAMP.

Printed and Published by S. Prtahap Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad Dn.